# ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ సూచిక

సంపాదకుడు

పాతూరి నాగభూషణం, డి. యల్. యస్‌సి.

సంగ్రాహకులు

వెలగా వెంకటప్పయ్య, బి. ఏ., డి. యల్. యస్‌సి.

మహీధర జగన్మోహనరావు

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

పటమట :: విజయవాడ-6

1962

వాయువెట్టులు స్వేచ్ఛమై ప్రజకు దొరుకు
నట్లె జ్ఞానంబుకూడను నబ్బవలయు

ఉదక మెల్లర కేరీతి నొదవునట్లె
జ్ఞానముంగూడ సేవ్యంబుగాగవలయు

సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యొసగునట్లె
జ్ఞానముంగూడ సులభంబు గాగవలయు.

# ప్రస్తావన

కేంద్రప్రభుత్వం శాస్త్రపరిశోధన, సాంస్కృతిక కార్యకలాపాల మంత్రిత్వశాఖవారి సహాయం ఈ గ్రంథప్రచురణకు ముఖ్యంగా ప్రోత్సాహమిచ్చింది. 1960 నవంబరులో వాఙ్మయసూచిక ప్రచురణ నిమిత్తం ఇండియా గవర్నమెంటు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘానికి రు. 900 లు మంజూరుచేసింది. దీనిపై 20-11-60 వ తేదీ శ్రీ సర్వోత్తమ భవనములో కూడిన సంఘ కార్యనిర్వాహణ సమితివారు ఈ పని నిమిత్తం దిగువసభ్యులతో ఒక కమిటీని ఏర్పాటు చేసి 1961 జనవరి 15 వ తేదీనాటికి జాబితాను సిద్ధపరచునట్లు కోరినారు.

శ్రీ పాతూరి నాగభూషణం, సమావేశకర్త
శ్రీ మహీధర జగన్మోహనరావు
శ్రీ వెలగా వెంకటప్పయ్య

ఆ పైన దేశంలోని వివిధ గ్రంథప్రకాశకులకు, గ్రంథకర్తలకు ప్రత్యేక విజ్ఞప్తులు పంపి కొంత భోగట్టా సేకరించడం జరిగింది. తెలుగులోని ముఖ్యగ్రంథాలను అన్నిశాఖలలోను ప్రస్తుతం వెలకు లభిస్తున్న వాటిని జాబితాచేసి ముద్రించిన పక్షంలో గ్రంథాలయ నిర్వాహకులకు, పుస్తకప్రియులకు కొంత ఉపయోగంగా వుంటుందనే తలంపుతో ఈ గ్రంథనిర్మాణానికి పూనుకోవడం జరిగింది. ఈ పని చాల చిక్కులతో కూడింది. స్వయంగా ఒక్కొక్క పుస్తకాన్ని చూస్తేనే తప్ప దానిని జాబితాలో చేర్చడాని కవకాశముండదు. అన్నిగ్రంథాలూ ఒక్కచోట చిక్కవు. చిక్కిన పుస్తకాలుకూడ ప్రస్తుతం లభించేదీ లేనిదీ తెలియదు. ఎన్నో ఉత్తమగ్రంథాలు నేడు లభ్యం కావడంలేదు. అందుచేత వాటి నీజాబితాలో చేర్చి ప్రయోజనంలేదు. ఒక్కొక్కపుస్తకంయొక్క గణ్యతను చకచక

నిర్ణయించడంకూడ కష్టమైన పని. కొందరు గ్రంథకర్తలు బహుళంగా వ్రాసిన వారున్నారు; కొందరు చాల తక్కువ రచనలనే చేసినారు. కనుక వీరి రచనల ఎన్నికలో కూడ కొంత యిబ్బంది వుంటుంది. ఇన్ని చిక్కుల నెదుర్కొని ఈ జాబితాను తయారు చేయవలసివచ్చింది. కనుక దీని నిర్మాణంలో ఎన్నో పొరపాట్లు దొరలివుంటాయి. దీనికొక అనుబంధాన్ని ప్రచురించి నెమ్మదిమీద కొన్ని పొరపాట్లను సవరించుకునే సంకల్పం మాకున్నది. దీనికి గ్రంథాలయాభిమానులు, పుస్తకప్రియులు, ప్రచురణకర్తలు, రచయితల సహకారాన్ని మేమర్థిస్తున్నాము.

జాబితా కూర్పులోనే కాక ఒక్కొక్క పుస్తకాన్నిగూర్చిన సమాచారణ సేకరణలోకూడ వ్రాతతప్పులు దొరలివుంటాయి. సేకరించిన సమాచారాన్ని తిరిగి సవరించే అవకాశాలుకూడ మాకు లేకపోయినవి. అచ్చుపనికూడ కొంత హడావిడిగ జరిగింది. కనుక చేయవలసిన ముఖ్యసవరణల వివరాలను ఎవ్వరుగాని తెలిపిన, కృతజ్ఞతతో స్వీకరించి అవసరమైన వాటినీ అనుబంధంలో ప్రకటించే ప్రయత్నం చేస్తాం.

గ్రంథాలయక్షేత్రంలో ఈ రకపు జాబితాలు చాల ప్రయోజనకారులు. నేటికాలంలో ఈ జాబితాల నిర్మాణం గ్రంథాలయ శాస్త్రంలో ప్రముఖభాగంగా యేర్పడింది. ఈ నడుమ మన కేంద్ర ప్రభుత్వం దేశంలో వెలువడే వివిధ భాషల గ్రంథాల జాబితాలను విడివిడిగ త్రైమాసిక సంచికలుగను, వార్షిక సంచికలుగను, జాతీయగ్రంథసూచి పేరుతో ప్రచురింప జేస్తున్నది. ఇవి యెప్పటికప్పుడు వెలువడే పుస్తకాల సమాచారం మాత్ర మందిస్తాయి. ఇంతకుముందు మనభాషలో వెలువడిన గ్రంథాలు చాలాఉన్నాయి. వీటి వివరాలు తెలిపే ప్రచురణలు తెలుగులో అంతగా లేవు. ఆంధ్ర వాఙ్మయ సూచిక పేరుతో కీ. శే. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు 1929 వ సం॥లో ఒక ఉద్గ్రంథాన్ని

ప్రచురించారు. దీనిలో 1927 వ సం॥ చివరవరకు ముద్రింపబడిన ఆంధ్రగ్రంథముల యొక్కయు, కాకినాడలోని ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున, తంజావూరు సరస్వతీ పుస్తక భాండాగారమున, చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గల అముద్రితాంధ్రగ్రంథముల యొక్కయు అకారాది సూచి ఇవ్వబడింది. ఇందలి పుస్తకాలలో చాలాభాగం ఇప్పుడు దొరికేవికావు. దీనికి పిమ్మట గత 34 సంవత్సరాలలో ఇంకెన్నో క్రొత్త పుస్తకాలు వెలువడినవి. వీటిలో కూడ చాలా ప్రస్తుతం లభ్యంకావు. లభించే వాటిలో కూడ అన్నీ సేకరించ దగినవిగా ఉండవు. అందుచేత వీటిలో ముఖ్యమైన వాటిని జాబితా చేస్తే గ్రంథాలయాలు, పుస్తకప్రియులు తమ కను కూలమైన వాటిని సంపాదించే టందు కవకాశముంటుందని మేము తెలుగులో సుమారు 2000 ఉత్తమగ్రంథాలను జాబితా చేయుదమని దీనికి ప్రాతిపదికగా 'ఆంధ్ర గ్రంథములు - మొదటిజాబితా'ను, 225 పుస్తకాల వివరాలను చేర్చి, 1945 వ సం.లో ప్రచురించినాము. తర్వాత 2, 3 జాబితాలనుకూడ ప్రకటించవలె ననుకొన్నాము. కాని యింతవరకు ఈపని చేయలేకపోయినాము. ఇప్పటికి కేంద్ర ప్రభుత్వం వారి సాయంతో మా సంకల్పాన్ని నెరవేర్చుకునే అవకాశం లభించింది. దీనికి మేమెంతో ఆనందిస్తున్నాము.

పై జాబితా ప్రచురణకు మేము పూనినప్పుడు మా సంఘోపాధ్యక్షులు శ్రీ నాగినేని వెంకయ్యగారు మాకు ముందు రు. 100 లు విరాళమిచ్చుటయేగాక మరికొంత సాయంచేయగలమని మాటయిచ్చినారు. ఈ వాగ్దానం మేరకు తర్వాత కొంతకాలానానికి మరి రు. 500 లు, ప్రస్తుతం రు. 300 లు వీరు మాకు విరాళంగా ఇచ్చియున్నారు.

ఈ వాఙ్మయసూచిక నిర్మాణానికి సంబంధించి ఒకటి రెండు విషయాలు మనవి చేయవలసియున్నది. ప్రపంచప్రసిద్ధమైన డ్యూయీ దశాంశవర్గీకరణ పద్ధతిని మేము దీని నిర్మాణంలో అవలంబించి

నాము. అయితే ప్రతి పుస్తకాన్ని మేము వర్గీకరించి వర్గసంఖ్యల నివ్వలేదు. స్థూలంగా ప్రధానవిషయాల క్రింద పుస్తకాలను వర్గీకరించి వీటికి వర్గసంఖ్యలను ఇచ్చినాము. అమెరికా విధానాన్ని మన పుస్తకాలకు అన్వయించుకోవలసి రావడంలో అక్కడక్కడ అవసరమైన మార్పులు చేసినాము. బాలసాహిత్యాన్ని ప్రత్యేకం విడదీసి దీనిని మరికొంత స్థూలంగా వర్గీకరించినాము. విషయ విభజన ననుసరించి యేర్పాటు చేసిన ఒక్కొక్క శీర్షిక క్రింద, ముందు ఆయా గ్రంథకర్తలను, ఒక్కొక్కరి రచనలను అకారాదిగ పేర్చినాము. ప్రతి పుస్తకానికి కర్త, పేరు, ప్రకాశకులు, ప్రచురణ తేది, ముద్రణ సంఖ్య, పరిమాణము, పుటలు, వెల వివరంగా తెలిపినాము. పుస్తకాల పరిమాణం సెంటిమీటర్లలోను, వెల రూపాయలు, నయాపైసలలోను యిచ్చినాము. ఆయా పుస్తకాల క్రింద వివరంగా ఇవ్వని కొందరు గ్రంథ ప్రకాశకుల చిరునామాలను ఈ సంవత్సరాంతాన మేము ప్రచురించ సంకల్పించిన అనుబంధం చివరను చేర్చ దలచినాము. సమాచార సేకరణ సమయములో పొరపాటున వదలిన వివరాలను పూరించడం సాధ్యంకాక అక్కడక్కడ వదలివేసినాము. ఒకటి రెండు తావులలో తప్ప వీలైనంతవరకు ప్రస్తుతం లభించే పుస్తకాల కట్టకడపటి ప్రచురణలనే యీ జాబితాలో చేర్చియున్నాము. ఎంతకష్టపడి తయారు చేసినప్పటికీ మానవ ప్రయత్నంలో సహజంగా వుండే దొసగు లిందులో దొరలినవి. అక్కడక్కడ వర్గీకరణ విషయంలోకూడా కొన్ని పొరపాట్లుచేసి యుందుము. వీటిని విజ్ఞులు సహృదయముతో మాకు తెలుపుచో వీని అనుబంధం లోగాని, మలికూర్పులోగాని సవరణలను చేయుటకు మాకవకాశ ముంటుంది. ఈ జాబితాలో చేర్చదగిన మరికొన్ని ముఖ్య గ్రంథాల వివరాలు మాకెవ్వరయిన తెలియజేసిన యెడల కృతజ్ఞతతో స్వీకరించి అనుబంధంలో చేర్చేటందుకు ప్రయత్నిస్తాము.

ఈ గ్రంథ ప్రచురణకు సంకల్పం జరిగి యేడాది దాటినది. ఇందు నిమిత్తం యేర్పాటు చేయబడిన ఉపసంఘ సభ్యులు ముగ్గురూ మూడు తావులకు చెందినవారు, తీరికలేనివారు. ఏ ఒక్క చోటినుండి గాని వీటి వివరాలు సేకరించే అవకాశంకూడా లేదు. అందుచేత సమాచార సేకరణలో చాల జాప్యం జరిగింది. 1961 జనవరి నాటికి తయారు కావలసిన గ్రంథం 1962 మార్చికిగాని బయటకు రాలేదు. అయినను దీని సంగ్రాహకు లిరువురు దీని విషయమై శ్రద్ధతో పని చేయుటవల్ల యిప్పటికైనా దీనిని లోకాని కందజేయ గలిగినాము. వీరిలో శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు వ్యయ ప్రయాసలకోర్చి ఆంధ్రప్రదేశ్ లో పలుతావులలోని ప్రముఖ గ్రంథాలయాలను, గ్రంథ విక్రయశాలలను దర్శించి, వానియందలి పుస్తకాలను పరిశీలించి, జాబితాలో చేర్చదగినవాని సమాచారాన్ని, వివరంగా విడివిడిగా చీట్లపై వ్రాసి పంపినారు. మార్చి 10 వ తేదీవరకు వారినుండి మాకు సమాచారం అందుతూనే వున్నది. వీరి దీక్ష, విరామమెరుగని ప్రేమ పూర్వకమైన కృషి మూలంగానే ఇప్పటికైనా యీ గ్రంథం వెలువడుట కవకాశ మేర్పడిందంటే అతిశయోక్తి లేదు.

## కృతజ్ఞత

ఈ పుస్తక ప్రచురణలో మాకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను తోడ్పడిన వివిధ సంస్థలయు, వ్యక్తులయు సహాయము మరువరానిది. మాకు సాయపడిన సంస్థలలో కోరినంతనే రు. 900 . 00 లు విరాళము నొసగిన కేంద్రప్రభుత్వము, పుస్తకాల సమాచార సేకరణకు అవకాశము కలుగజేసిన హైదరాబాదులోని ప్రభుత్వ కేంద్రగ్రంథాలయము, ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయ గ్రంథాలయం, గుంటూరుజిల్లా వేటపాలెంలోని శ్రీ సారస్వత నికేతనం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరసంబంధాలశాఖ సమాచార కేంద్రం, హైదరాబాదు నగరమందలి ప్రముఖ గ్రంథాలయాలు, పుస్తక విక్రయశాలలు తమ

తమ ప్రచురణల సమాచారాన్ని స్వయంగా అందజేసిన గ్రంథప్రచురణ సంస్థలు ముఖ్యమైనవి. వ్యక్తులలో ఆర్థికంగా సహాయపడిన మా సంఘోపాధ్యక్షులు, ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు అధ్యక్షులునగు శ్రీ నాగినేని వెంకయ్యగారు, ఉప సంఘ సభ్యులలో యెక్కువ శ్రమచేసిన శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు యెన్నదగినవారు. కోరినంతనే అభిమానంతో తమ ప్రకటనలను ఇచ్చిన ప్రకటన కర్తలు, వ్యక్తిగతంగా తమ రచనల సమాచారాన్ని మాకు పంపిన గ్రంథ కర్తల తోడ్పాటుకూడ లెక్కింప దగినదే. పుస్తకముద్రణలో పటమటలంక సర్వోదయప్రెస్‌వారు, విజయవాడ పాండురంగ ప్రింటింగ్ వర్క్సువారు తమపనిని చాల త్వరితముగను, శ్రద్ధగను నెరవేర్చి చేసిన సాయంకూడ పెద్దదే. ఇన్నివిధాల పలుసంస్థల, ఎందరో వ్యక్తుల సహకారంతో యీ గ్రంథం బయటపడింది. వీరందరికీ మేము మా హృదయపూర్వకమైన కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

## అంకితము

గ్రంథాలయ రంగంలో జగద్విఖ్యాతి గాంచిన మనీషి డాక్టరు యస్. ఆర్. రంగనాథన్‌గారికి యీ కార్యక్రమం యెంతో ప్రీతిపాత్రమైనది. ఆయన డెబ్బది యొకటవ జన్మదినమును పురస్కరించుకొని మన దేశంలో వివిధ నగరాలలోనేగాక దేశదేశాలలో ఉత్సవాలు జరుగనున్నవి. వీరిని సంఘ యావజ్జీవ గౌరవ సభ్యులుగా యెన్నుకొనుటకు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ మేనాడో తీర్మానించుకొన్నది. ఇప్పుడు వారి 71 వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని 'గ్రంథాలయశాస్త్రంలో దేవుని దర్శింతు'నన్న యీ గ్రంథాలయశాస్త్ర తపస్వికి, చంద్రునికి నూలుపోగువలె ఈ గ్రంథమును భక్తితో సమర్పించుకొనే అవకాశం చిక్కినందుకు మమ్ము మే మభినందించు కొంటున్నాము. ఈ మహనీయునికి దైవము చిరాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించి, వీరి సేవ ప్రపంచానికి మరికొంత కాలంపాటు లభించేటట్లు చేయవలసినదిగ వేడుకొంటున్నాము.

దేశంలోని గ్రంథాలయాలు, పుస్తకప్రియులు యీగ్రంథాన్ని తగురీతిగ ఆదరింతురని, యీవిధంగా మా కృషి ధన్యత గాంచునని ఆశించుచున్నాము.

శ్రీసర్వోత్తమ భవనము
విజయవాడ-6
15–3–1962

పాతూరి నాగభూషణం
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘము

షరా:- ఈ గ్రంథములోని బాలవాఙ్మయ విభాగము 48 పుటలు విజయవాడలోని పాండురంగ ప్రింటింగ్ వర్క్సులో ముద్రింప బడినది.

# విషయ సూచిక

గమనిక: తెలుగు నాటికలకు పిమ్మట చేర్చవలసిన తెలుగు నవలలు పొరపాటున తెలుగు నాటకములకు ముందు చేర్చబడినవి.

# ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ సూచిక

## 000 - సర్వ సామాన్య గ్రంథములు

### 010 - వాఙ్మయ సూచికలు

ఆంధ్ర గ్రంథములు : మొదటిజాబితా
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, పటమటలంక.
1945 సైజు 21 . 4 × 13 . 6 సెంటిమీటర్లు
పుటలు 36 వెల : రు. 0 . 37

ఆంధ్ర వాఙ్మయ సూచిక :
ముద్రితాముద్రిత గ్రంథముల పట్టిక. 2భాగములు
కాశీనాథుని నాగేశ్వరరావు,
ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి.
1929 సైజు 24 . 5 × 18 . 5 సెం. మీ.
పు. 114+390+60+56 రు. 3 . 00

A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Tanjore Maharaja Serfojis' Saraswati Mahal Library.
ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు
1933 సైజు 24 . 4 × 16 . 5 సెం. మీ.
పు. 34+362+21 రు. 2 . 00

బి. యస్. కేశవన్ : జాతీయ గ్రంథసూచి (తెలుగువిభాగము)1958
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయశాఖ డైరెక్టరు
1960 సైజు 22 × 14 . 2 సెం. మీ. పు. 32+229 రు. 2 . 00

### 020 - గ్రంథాలయ శాస్త్రము

ఇరువదిమూడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ,
పెదపాలెము – 1942 మే 27 – 28
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము
1942 సైజు 21 . 9 × 13 . 7 సెం. మీ. పు. 8+88 రు. 1 . 00

ఇరువదినాలుగవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ,
హిందూపురము – 1942 డిసెంబరు 29–31, 1943 జనవరి 1
ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
1943 సైజు 21 . 6 × 13 . 8 సెం. మీ.
పు. 6 + 67 రు. 0 . 75

ఇరువదియైదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ,
సింగరేణి కాలరీస్ – నివేదిక 1944 ఆగస్టు 24, 25, 26
ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
1947 సైజు 21 . 5 × 14 . 2 సెం. మీ.
పు. 10 + 114 రు. 1 . 50 ఇంగ్లీషు అనువాదంతో రు. 2 . 00

ఇరువదియారవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ,
క్యాతూరు – నివేదిక 1946 మార్చి 1, 2, 3
ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
1947 సైజు 21 . 9 × 14 సెం. మీ.
పుటలు 12 + 80 రు. 1 . 00

ఇరువదియేడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ,
సూర్యాపేట – 1950 ఏప్రిల్ 7, 8, 9
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము
1957 సైజు 21 . 2 × 13 . 5 సెం.మీ.
పు. 20 + 92 రు. 1 . 50

ఇరువది యెనిమిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ,
చాగలమర్రి – నివేదిక 1951 జులై 21, 22
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము
1958 సైజు 21 . 5 × 13 . 9 సెం. మీ.
పు. 8 + 44 రు. 0 . 75

కొడాలి లక్ష్మీనారాయణ
ప్రాచీనభారతీయ గ్రంథాలయచరిత్ర
ఇతిహాసపరిశోధకమాల, మోపఱ్ఱు, గుంటూరుజిల్లా
1946 సైజు 27 . 2 × 14 . 2 సెం. మీ. పు. 112 రు. 2 . 50

పాతూరి నాగభూషణం

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమము
ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
1957 సైజు 15.3 × 12.3 సెం. మీ.
పుటలు 6 + 60 రు. 0.75

గ్రంథాలయ గీతాలు (సంకలనము)
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము, పటమట, కృష్ణాజిల్లా
1961 ద్వితీయ ముద్రణ. సైజు 18 × 12 సెం. మీ.
పు. 16 + 124 రు. 1.60

గ్రంథాలయ ప్రచారం; విజ్ఞానవ్యాప్తి
ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
1950 సైజు 13.8 × 11 సెం. మీ.
పు. 8 + 54 రు. 0.50

గ్రంథాలయములు [వ్యాసావళి]
ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాదు.
1951 సైజు 21.6 × 14.0 పు. 20 + 128 రు. 2.00

గ్రంథాలయములు : రిజిస్ట్రేషను
ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
1953 రెండవ కూర్పు. సైజు 18.3 × 12.5 సెం. మీ.
పు. 8 + 36 రు. 0.62

గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు
సేవాశ్రమము, పెదపాలెము, తెనాలి తాలూకా
1947 సైజు 18 × 12.3 సెం. మీ.
పు. 30 + 210 + 12 రు. 3.00

గ్రంథాలయ సూక్తులు (సంకలనము)
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము
1955 సైజు 13 × 10.8 సెం. మీ.
పు. 8 + 102 రు. 1.00

పాతూరి నాగభూషణం

గ్రంథాలయ సూత్రాలు (అను.)
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము
1950 సైజు 13.8 × 10.8 సెం. మీ.
పు. 10+60 రు. 0.50

తెలుగు పుస్తకాల వర్గీకరణము
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము
1950 సైజు 13.5 × 10.8 సెం. మీ.
పు. 6+32 రు. 0.31

పఠన మందిరాలు
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము
1961 రెండవకూర్పు. సైజు 13.8 × 10.7 సెం. మీ.
పు. 18+84 రు. 1.00

మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము
1951 సైజు 18.5 × 12.3 సెం. మీ.
పు. 8+64 రు. 0.75

## 030 - విజ్ఞాన కోశములు

ఆంధ్ర విజ్ఞానము (Telugu Encyclopaedia)
కందుకూరి బాల సూర్య ప్రసాద భూపాలుఁడు
మొదటి సంపుటము 1938
పు. 2+4+4+2 ఛార్టులు +560 సైజు 28.6 × 20.8 సెం.మీ. రు. 9.00
రెండవ సంపుటము 1938
పు. 2+46+561-1120 ,, రు. 11.00
మూఁడవ సంపుటము 1939
పు. 2+33+1121–1640 ,,
నాల్గవ సంపుటము 1940
పు. 2+34+1641–2160 ,,

ఐదవ సంపుటము 1941
పు. 2+36+2161-2736 సైజు 28.6 × 20.8 సెం. మీ.
ఆఱవ సంపుటము 1941
పు. 2+42+2737–3316 ,,
ఏడవ సంపుటము 1941
పు. 2+26+3317–3708+అనుబంధము 2+6+184 ,,

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము
కొమర్రాజు వేంకటలక్ష్మణరావు (సంపా.)
ప్రథమ సంపుటము. 'అ' నుండి 'అధ్వర్య' వఱకు
కా. నాగేశ్వరరావు, ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ కార్యాలయము.
1932 సైజు 28.3 × 21.6 సెం. మీ.
పు. 6+8+600 రు 10.00
ద్వితీయ సంపుటము. 'అన్' నుండి 'అశ్వని' వరకు
కా. నాగేశ్వరరావు, ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ కార్యాలయము
1934 సైజు 28.3 × 21.6 సెం. మీ.
పు. 6+602 రు. 10.00

ఆంధ్ర సర్వస్వము
మాగంటి బాపినీడు
కొండపల్లి ప్రచురణ
1961 సైజు 19×12.7 సెం. మీ.
పు. 14+572 రు. 15.00

తెలుగు విజ్ఞాన సర్వస్వము
మొదటి సంపుటము : చరిత్ర – రాజనీతి
తెలుగు భాషాసమితి, మద్రాసు – 5.
1954 సైజు 25.4×19 సెం. మీ.
పు. 16+1013+47 రు. 25.00
రెండవ సంపుటము : భౌతిక, రసాయన శాస్త్రములు
తెలుగు భాషాసమితి, మద్రాసు – 5.
1955 సైజు 25.4×19
పు. 32+1112+28+8+4 రు. 25.00

మూడవ సంపుటము – తెలుగు సంస్కృతి
తెలుగు భాషాసమితి, మద్రాసు – 5.
1959 సైజు 25 . 4×19
పు. 36 + 1246 + 22 రు. 25 . 00

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము
మొదటి సంపుటము : అ నుండి ఆర్ష వరకు
సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి, హైదరాబాదు.
1958 సైజు 28 . 4×22 . 2 సెం. మీ.
పు. 800 + 30 రు. 20 . 00
రెండవసంపుటము : ఆర్ష వాస్తు శాస్త్రమునుండి కృష్ణానదివరకు
సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి, హైదరాబాదు.
1960 సైజు 28 . 4×22 . 2 సెం. మీ.
పు. 805 + 23 రు. 20 . 00

## 040 - సామాన్య వ్యాసములు

కట్టమంచి రామలింగారెడ్డి
వ్యాసమంజరి
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.
1947 సైజు 22 . 2×14 . 2 సెం. మీ.
పు. 5 + 232 రు. 2 . 50

కొమర్రాజు వేంకటలక్ష్మణరావు
లక్ష్మణరాయ వ్యాసావళి (పథమ సంపుటము)
విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి, చెన్నపట్టణము.
1923 సైజు 18 . 3 × 12 సెం. మీ.
పు. 10 + 324 రు. 2 . 00

గురజాడ అప్పారావు
వ్యాసచంద్రిక
విశాలాంధ్ర ప్రచురణ, బెజవాడ.
1955 ద్వితీయ ముద్రణము. సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 172 రు. 1 . 50

గ్రామ పునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసములు
(15–5–29 నుండి 5–6–29 వరకు తాడేపల్లిగూడెం తాలూకా బోర్డువారు నడపిన వసంతఋతు విద్యాలయములో ఆంధ్ర ప్రముఖులుచేసిన ఉపన్యాసములు)
యస్. సుబ్బారావు, కొవ్వూరు, ప. గో. జిల్లా
1929 సైజు 18 . 3 × 12 సెం. మీ.
పు. 32+472 రు. 1 . 50

చలం

ఆనందం
దేశీ ప్రచురణ
1956 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 144 రు. 1 . 50

విషాదం
దేశీ ప్రచురణ
1956 సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 128 రు. 1 . 50

మ్యూజింగ్సు 3 భాగములు
దేశీ ప్రచురణ
1956 సైజు 19×12 . 7
పు. 278, 257, 319 భాగము 1 కి రు. 3 . 00

నార్ల వెంకటేశ్వరరావు

పిచ్చాపాటి
ప్రతులకు : నార్లవారు, విజయవాడ–2
1951 సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 133 రు. 1 . 50

మాటా మంతీ
ప్రతులకు: నార్లవారు, విజయవాడ – 2.
1951 సైజు 19×12 . 7
పు. రు. 1 . 50

విస్సా అప్పారావు

వ్యాసావళి

ప్రతులకు: వెంకట్రామా అండ్ కో, విజయవాడ.

1956 సైజు 19×12 . 7 సెం. మీ.

పు. 4+232+4 రు. 2 . 50

## 070 - పత్రికారచన

నర్రావుల సుబ్బారావు

పత్రికారచన

కిసాన్ పబ్లికేషన్సు, బుర్రిపాలెం, తెనాలితాలూకా

1960 సైజు 19×12 . 7 సెం. మీ.

పు. రు. 1 . 50

పత్రికా రచన (జర్నలిజం)

గుంటూరుజిల్లా పత్రికా రచయితల సంఘం, గుంటూరు.

1951 సైజు 18 . 3 × 12 . 4 సెం. మీ.

పు. 4+72 రు. 1 . 00

# 100 - తత్వశాస్త్రము

## 130/150 మనస్తత్వ శాస్త్రము

ఐ. జి. చౌదరి

మాంత్రీక శాస్త్రము

కొండపల్లి ప్రచురణ

1955 సైజు 22 . 2×14 . 2 సెం. మీ.

పు. 88 రు. 1 . 00

కే. వేదాంతాచారి

పిల్లల శిక్షణాసమస్యలు

శాస్త్ర విజ్ఞాన, చరిత్ర తెలుగు - ఉర్దూ అకాడమీ,

హైదరాబాదు.

1960 సైజు 19×12 . 7

పు. 10+212+8 రు. 3 . 00

దామరాజు శివరామయ్య

మెస్మరిజం
వావిళ్ల ప్రచురణ
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 118 రు. 2 . 00

బి. కుప్పుస్వామి

శిశు మనోవిజ్ఞానము
వావిళ్ల ప్రచురణ
1950 సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 286 రు. 2 . 50

ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రి

మనస్తత్త్వ శాస్త్రము
వావిళ్ల ప్రచురణ
1940 సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 8+20+675 రు. 5 . 00

వల్లూరి సూర్యనారాయణరావు

మనస్స్వాతంత్ర్యము 1, 2, 3, 4 భాగాలు
ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు.
1932 — 1937 సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 156, 176, 164, 196 భాగము 1కి రు. 0 . 50

## 133 . 5 జ్యోతిష శాస్త్రము

ఆకెళ్ల వెంకటశాస్త్రి

జాతక మార్తాండము 3 భాగములు
కొండపల్లి ప్రచురణ
సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 230, 330, 228 భాగము 1కి రు. 2 . 00

జ్యోతిష విద్యా ప్రకాశిక 4 భాగములు
కొండపల్లి ప్రచురణ
సైజు 19×12 . 7 సెం. మీ.
(2) పు. 396, 387, 396, 304 భాగము 1కి రు. 3 . 00

దామరాజు శివకామయ్య
సంఖ్యా శాస్త్రము
వావిళ్ల ప్రచురణ
1955 సైజు 19×12.7 సెం. మీ. పు. 141 రు. 2.00

పింగళి వెంకటరామజోస్యులు
జ్యోతిషార్ణవ నవనీతము
వావిళ్ల ప్రచురణ
సైజు 22.2×14.2 సెం. మీ. పు. 214 రు. 3.00

మంత్రిప్రగడ లక్ష్మీనారాయణ
సర్వార్థ చింతామణి (అనువాదం)
వావిళ్ల ప్రచురణ
1950 సైజు 22.2×14.2 సెం. మీ. పు. 6+422 రు. 5.00

మహేంద్రవాడ వీరగణపతిశాస్త్రి
భృగురాజకాండ
మహేంద్రవాడ పబ్లిషింగ్ హౌస్, యానాం.
1957 సైజు 19×12.7 సెం. మీ.
పు. 8+280 రు. 5.00

వరాహ మిహిరాచార్య
బృహజ్జాతకము
వావిళ్ల ప్రచురణ
1949 సైజు 22.2×14.2 సెం. మీ.
పు. 14+456+16 రు. 5.00

## 133.6 హస్త సాముద్రికము

పారాబత్తుల సూర్యనారాయణ
సాముద్రిక రత్నాకరము
కొండపల్లి ప్రచురణ
1957 సైజు 22.2×14.2 సెం. మీ.
పు. 256 రు. 3.00

మహేంద్రవాడ వీరగణపతిశాస్త్రి

హస్త సాముద్రిక సంగ్రహము
మహేంద్రవాడ పబ్లిషింగ్ హౌస్, యానాం,
సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 4 + 26 రు. 0.50

లేళ్లపల్లి వెంకటాచలపతిశర్మ

సాముద్రిక విజ్ఞానము
రచయిత, మునిసిపల్ ఆఫీస్, విజయవాడ.
సైజు 22.2 × 14.2 సెం. మీ.
పు. 184 రు. 3.00

## 170 నీతి శాస్త్రము

డేవిడ్ ఎల్టన్ ట్రూబ్లడ్

జీవితం
యన్. ఆర్. చందూర్ అనువాదం
ప్రతిమా బుక్స్, మద్రాస్.
1957 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 233 రు. 2.50

మునునూరి వెంకటశాస్త్రి

నీతి ముక్తావళి
విశ్వభారతీ ప్రచురణాలయము, రాజమహేంద్రవరము.
1958 సైజు 16 × 10.7 సెం. మీ. పు. 84 రు. 1.00

## 180 పురాతన (ప్రాక్-పశ్చిమ) తత్త్వశాస్త్రము

జి. వి. కృష్ణరావు

జేగంటలు – 3. కాంట్ పరతత్త్వ వాదం
ప్రతులకు : టాగూర్ బుక్ హౌస్, తెనాలి.
1954 సైజు 19 × 12.7 సె. మీ.
పు. 73 రు. 2.00

ప్లేటో

సోక్రటీస్ అమరవాణి
పిలకా గణపతిశాస్త్రి అనువాదం
గుండిమెడాస్, ఏలూరు.
1960 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 16 + 104 రు. 1 . 00

## 181 . 45 యోగతత్త్వము

అరవిందులు

యోగసమన్వయము
కమలాకర వెంకటరావు అనువాదం
కృష్ణాపత్రిక, మచిలీపట్నం.
దుర్ముఖి సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 277 రు. 3 . 00

కందాళ వెంకటాచార్యులు

అద్భుత కుండలిని
గుప్త విద్యామండలి, విజయవాడ – 1.
1952 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 152 రు. 3 . 00

కాత్రావులపల్లి సూర్యనారాయణయోగిని

శ్రీమహాఋషి నిఘంటిత యోగశాస్త్రము
కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ.
1928 సైజు 25 × 16 . 5 సెం. మీ. పు. 40+596

పతంజలి

యోగతత్వ్వ దర్శనము
చర్ల గణపతిశాస్త్రి అనువాదం
సమిశ్రగూడెం, ప. గో. జిల్లా
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 4 + 80 రు. 0 . 75

పతంజలి ముని

యోగదర్శనము
గోపదేవ్ వ్యాఖ్య
ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలితాలూకా.
1952 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 30 + 173 + 16 రు. 2 . 50

పురాణం సూర్యనారాయణతీర్థులు

శ్రీమదాంధ్ర వచన శ్రీయోగవాసిష్ఠము–రెండు భాగములు
ప్రతులకు: రాజయోగి పమ్మి త్యాగరాయస్వాములవారు,
5 రామానుజకూటం వీధి, పాతచాకలిపేట, మద్రాసు.
1937 సైజు 22 . 2 × 14 . 2 సె. మీ.
పు. 632, 743 భాగము 1కి రు. 6 . 00

శ్రీయోగవాసిష్ఠము
పమ్మి త్యాగరాయశ్రేష్ఠి అండ్ సన్సు, మద్రాస్ – 21.
1959 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
మొదటిసంపుటము పు 632 రెండవసంపుటము పు.744 మొత్తం రు. 10 . 00

వాల్మీకి

జ్ఞాన వాసిష్ఠము–తెలుగువచనము
వెన్నెలకంటి సుందరరామశర్మ రచన
వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు.
1959 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 16 + 690 రు. 10 . 00

వాసిష్ఠ రామాయణము అను యోగవాసిష్ఠము
'తాత్పర్య ప్రకాశిక' యను ఆంధ్రానువాద సహితము
శ్రీపూర్ణానందేత్యపర నామధేయ శ్రీనిర్వికల్పానందస్వామి
అనువాదము

ప్రచురణ : శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు, చిత్తూరుజిల్లా.
సైజు 25 × 17 . 2 సెం. మీ.

పూర్వార్థము – ప్రథమ సంపుటము
1954 పు. 6 + 6 + 1034
పూర్వార్థము – ద్వితీయ సంపుటము
1954 పు. 1035 నుండి 1994 వరకు
ఉత్తరార్థము – ప్రథమ సంపుటము
1948 పు. 1995 నుండి 3146 వరకు
ఉత్తరార్థము – ద్వితీయ సంపుటము
1948 పు. 3147 నుండి 4242 వరకు

వెన్నెలకంటి సుందరశర్మ
శ్రీమదాంధ్రి వచన జ్ఞానవాశిష్ఠము
వావిళ్ల ప్రచురణ
1951 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 16 + 736 రు. 10 . 00

వెన్నెలకంటి సుందరరామశర్మ
జ్ఞానవాశిష్ఠము (వచనము)
వావిళ్ల ప్రచురణ
1958 సైజు 24 . 4 × 15 . 5 సెం. మీ.
పు. 15 + 690 రు. 10 . 00

స్వాత్మారామ యోగీంద్ర
హఠయోగ ప్రదీపిక
రాచకొండ అన్నయ్యశాస్త్రి టీక, తాత్పర్యము
వావిళ్ల ప్రచురణ
1954 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 14 + 472 రు. 3 . 50

## 181 . 4 భారతీయ తత్త్వ శాస్త్రము

అనుభవానంద స్వాములవారు
సర్వసిద్ధాంత సౌరభము
అనుభవానంద గ్రంథమాల, బాపట్ల, గుంటూరుజిల్లా (లేదా)
భీమునిపట్నం, విశాఖజిల్లా
సైజు 19 × 12 . 7 సెం. మీ.

మొదటిభాగము - సాంఖ్య, యోగదర్శనములు
1954 పు. 52 + 300 రు. 3 . 25
ద్వితీయభాగము - వైశేషిక, న్యాయదర్శనములు
1956 పు. 10 + 16 + 262 రు. 3 . 00
తృతీయభాగము - మీమాంసా - వేదాంత దర్శనములు
1956 పు. 13 + 20 + 302 రు. 3 . 00
చతుర్థభాగము - శ్రీ శంకర పూర్వాద్వైతము
1958 పు. 440 రు. 4 . 25
పంచమభాగము - శ్రీ శంకరాద్వైతము
1960 పు. 526 రు. 4 . 25
ఆరవభాగము - శ్రీ శంకరానంతరాద్వైతము
1960 పు. 370 రు. 3 . 25
సాధన రహస్యము
శ్రీ అనుభవానంద గ్రంథమాల
1953 ద్వితీయముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 330 రు. 2 . 25

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)
గతితార్కిక భౌతికవాదం
విశాలాంధ్ర ప్రచురణ
1955 సైజు 19 × 12 . 7 పు. 119 రు. 1 . 00

కురుగంటి సీతారామయ్య
షడ్దర్శనము
కురుగంటి గ్రంథావళి ప్రచురణ సంఘం, గద్వాల,
మహబూబ్ నగర్ జిల్లా
సైజు 19 × 12 . 7 సెం. మీ. రు. 0 . 75

కొండూరు వీరరాఘవాచార్యులు
ఆత్మదర్శనము
రచయిత, వి. యస్. ఆర్. కాలేజి, తెనాలి.
1944 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 210 రు. 2 . 50

కొత్తమాసు కూర్మారావు
లక్ష్యం ఒక్కటే
విజ్ఞాన సమితి, వల్లభాపురం, తెనాలితాలూకా
1951 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 26 + 180 + 131 రు. 3 . 00

కొల్లూరి కామశాస్త్రి (అను.)
ధర్మసింధు
వావిళ్ల ప్రచురణ
1954 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 16 + 760 రు. 6 . 50

కొల్లూరు సోమశేఖరశాస్త్రి, శైలేశ్వరసేన్
సాంఖ్యదర్శనము (సటిప్పణము)
కవిరాజ పబ్లిషర్సు, తెనాలి.
1950 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 205 + 7 రు. 2 . 50

గోపీచంద్
పోస్టుచెయ్యని ఉత్తరాలు (ఆధ్యాత్మికభౌతికవాదసమన్వయం)
దేశిప్రచురణ
1956 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 8 + 128 రు. 1 . 50

చిన్నమ్మ
జన్మతరించు చిన్నమ్మపలుకులు
శాంతి కుటీరం, రేపల్లె.
1957 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 8 + 184 రు. 0 . 75

జి. వి. కృష్ణరావు
ఆర్యనాగార్జునుని విగ్రహ వ్యావర్తని
సాహితీ కేంద్రము, తెనాలి.
1959 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 16 + 208 + 7 రు. 6 . 00

త్రిపురనేని వెంకటేశ్వరరావు

భారతీయ తత్త్వశాస్త్ర పరిశీలన
నవోదయ పబ్లిషర్సు, గుడివాడ, కృష్ణాజిల్లా
1956 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 406 రు. 3.00

శంకరాద్వైతం
నవోదయ పబ్లిషర్సు, విజయవాడ
1959 సైజు 19 × 12 సెం. మీ.
పు. 143 రు. 1.75

నిర్వి కల్పానందస్వామి

భారతీయ తత్త్వశాస్త్రము - ప్రథమభాగం
షడ్దర్శనములు-వేదాంతసూత్రభాష్య సంప్రదాయములు
సాధన గ్రంథమండలి, తెనాలి.
మూడవకూర్పు 1960 సైజు 19 × 12.7 సెం. మీ.
పుటలు 196 వెల రు. 2.00

పరమానంద తీర్థులు

బ్రహ్మవిద్యా సుధార్ణవము
వేదురుమూడి వెంకటకృష్ణారావు పీఠిక
మద్రాసుప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము, మద్రాసు
1952 సైజు 24.5 × 15.8 సెం. మీ.
పు. 12 + 138 రు. 3.88

పీతాంబర

శ్రీ విచార చంద్రోదయము
స్వామి జనార్దన చైతన్య భాషాంతరీకరణ
వావిళ్ల ప్రచురణ
1957 సైజు 19 × 12.7 సెం. మీ.
3) పు. 94 రు. 1.00

బలదేవ ఉపాధ్యాయ

భారతీయ దర్శనము - ప్రథమఖండము: శ్రౌత, గీతా దర్శనములు

సాధన గ్రంథమండలి, తెనాలి.

జయ. సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 10 + 154 రు. 1.50

భాగవతుల కృష్ణదేశికులు

శుద్ధ నిర్గుణతత్వ కందార్థములు

చెర్వీరాల భాగయ్య తాత్పర్య విశేషార్థములు

కొండా శంకరయ్య ప్రచురణ

1956 సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 143 రు. 1.00

యల్లాపంతుల జగన్నాథం

తరణోపాయం (సత్యపంథ)

గ్రంథకర్త, ఏలూరు

1950 సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 15 + 292 రు. 2.00

రామతీర్థ

వేదాంత దర్శనము

కె. సచ్చిదానందమూర్తి అనువాదం

శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల, గుంటూరుజిల్లా.

సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 327 రు. 2.50

రాయప్రోలు లింగనసోమయాజి

శ్రీ మదాంధ్ర వేదాంత పంచదశి: కళ్యాణామృత వ్యాఖ్యా సమేతము - 3 భాగములు

రచయిత, అడ్వకేట్, గుంటూరు

1954 సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 14 + 55 + 1155 రు. 2.50, 3.00, 2.50

విద్యారణ్యులు

వేదాంత పంచదశి

శ్రీరామకృష్ణ విరచిత వ్యాఖ్యానము

వావిళ్ల ప్రచురణ

1952 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 1036 + 4 రు. 12 . 50

వేదవ్యాస మునీంద్రులు

బ్రహ్మసూత్రార్థచంద్రిక - ఆంధ్రవచనం - 2 సంపుటములు

వెన్నెలకంటి సుందరరామశర్మ రచన

వావిళ్ల రామస్వామిశాస్త్రి & సన్స్, మద్రాసు.

1955 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.

పు. 992, 752 రు. 15 .00

శంకర భగవత్పాదులు

బ్రహ్మసూత్ర భాష్యమ్ - భాష్యరత్న ప్రభావ్యాఖ్యా, బ్రహ్మ తత్వ ప్రకాశికావ్యాఖ్యా, భాష్యార్థరత్నమాలా సహితా

వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు

1937 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 44 + 1554 రు. 10 . 00

శ్రీనాథపణ్డిత

పరహిత సంహిత - తెలుగు టీక, తాత్పర్యములు

నుదురుపాటి విశ్వనాథశాస్త్రి

వావిళ్ల ప్రచురణ

1952 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 23 + 471 రు. 8 . 00

సర్వేపల్లి రాధాకృష్ణన్

భారతీయ తత్త్వశాస్త్రము 1, 2, 3, 4, 5 సంపుటములు

అనువాదం : బులుసు వెంకటేశ్వరులు

బి. వి. అండ్ సన్సు, కాకినాడ

1959, 1960 ద్వితీయముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.

పు. 404, 550, 552, 450, 466 ఒక్కొక్క సంపుటము రు. 5 . 00

స్వామి చిద్ఘనానందగిరి

తత్త్వానుసంధానము
దే. ఆదినారాయణరెడ్డి, పే. కృష్ణారెడ్డి అనువాదకులు,
మరుదాడుపోష్టు, వందవాసి తాలూకా, నార్తు ఆర్కాటుజిల్లా
1919 సైజు 24 × 16 సెం. మీ.
పు. 16 + 4 + 392 రు. 4.50

## 200 మతములు

ఎం. కె. గాంధి (మహాత్మాగాంధీజీ)

నామతము
భరతన్ కుమారప్ప సంకలనము. మల్లవరపు విశ్వేశ్వరరావు
అనువాదము
గాంధిసాహిత్య ప్రచురణాలయము, గాంధీస్మారకనిధి,
ఆంధ్రశాఖ కాకినాడ
1960 సైజు 18 × 12.2 సెం. మీ.
పు. 13 + 332 రు. 3.50

మహాత్మాగాంధీజీ

సత్యమే దైవము
ఎ. సుబ్బరాయగుప్త అనువాదము
గాంధీసాహిత్య ప్రచురణాలయము, కాకినాడ
1961 సైజు 18.3 × 12.5 సెం. మీ.
పు. 8 + 240 రు. 2.50

కప్పగంతుల సత్యనారాయణ

మన మతములు - ప్రవక్తలు
కథామాల ప్రచురణలు, మద్రాసు
1958 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 170 రు. 2.00

కొత్త భావయ్యచౌదరి

దేవరహస్యాలు
రచయిత, సంగంజాగర్లమూడి, తెనాలితాలూకా
1948 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 12 + 164 రు. 2 . 00

బి. ఆర్. అంబేద్కరు

వర్ణభేదము : పునఃపరిశీలనము
సు. భా. సుబ్బారావు అనువాదము
జాతిభేద నిర్మూలకమండలి, యడ్లపల్లి, తెనాలితాలూకా
1954 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 42 రు. 0 . 50

వర్ణభేదము
సింగంపల్లి వెంకటసుబ్బారావు అనువాదము
సుందరరాం అండ్ సన్సు, తెనాలి.
1948 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 8 + 84 + 4 రు. 1 . 00

ముదిగంటి జగ్గన్నశాస్త్రి

కురల్ లేక తిరువళ్లురు సూక్తులు
పల్లెటూరు గ్రంథమండలి, తణుకు, ప. గో. జిల్లా
1952 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 8 + 209 రు. 2 . 25

రామతీర్థ

మతము
కేశవతీర్థస్వామి అనువాదం
శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల, గుంటూరుజిల్లా
సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 220 రు. 2 . 00

సర్వేపల్లి రాధాకృష్ణయ్య
భారతీయ హృదయము
బులుసు వెంకటేశ్వరులు అనువాదం
బి. వి. అండ్ సన్స్, కాకినాడ
1960 సైజు 19 × 12.7 సెం. మీ. పు. 194 రు. 3.00

## 212.5 దివ్యజ్ఞానము

అనీబిసెంటమ్మ
ఆధ్యాత్మిక నిష్ఠ
గుంటూరు వెంకటసుబ్బారావు అనువాదము
దివ్యజ్ఞాన చంద్రికా మండలి, బెజవాడ
1947 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 104 రు. 1.00
దివ్యజ్ఞానము
సారంగు లక్ష్మీనరసింహారావు అనువాదము
దివ్యజ్ఞాన చంద్రికా మండలి, బెజవాడ
1947 సైజు 19 × 12.7 సెం. మీ. పు. 32 రు. 0.37

## 220 - 280 క్రైస్తవము

టాల్‌స్టాయి
జీసను సందేశం
తల్లాప్రగడ ప్రకాశరాయుడు అనువాదము
శ్రీ లక్ష్మీనారాయణ సేవాశ్రమము, పెనమలూరు, కృష్ణాజిల్లా
1960 రెండవకూర్పు. సైజు 18 × 12.2 సెం. మీ.
పు. 8 + 120 రు. 1.50
డబ్లియు. ఇ. బాగ్బు
సంఘచరిత్ర సార సంగ్రహము
బాప్టిస్టుథియొలాజికల్ కాలేజి, రామాపట్నము, నెల్లూరుజిల్లా
1957 6 వ కూర్పు సైజు 22.2 × 14.2 సెం. మీ.
పు. 8 + 433 రు. 6.00

పరిశుద్ధ గ్రంథము

ఇందు పాతనిబంధన గ్రంథమును, క్రొత్త నిబంధన గ్రంథ మును ఇమిడియున్నవి.

ఇండియా సింహళదేశముల బైబిలు సొసైటీ, ఏ/1 మహాత్మ గాంధిరోడ్డు, బెంగుళూరు

1957 సైజు 27 . 2 × 16 . 5 సెం.మీ. పు. 6 + 807 + 4 + 245 రు. 6 . 00

పీటర్ మే

త్రిత్వసిద్ధాంతము

సి. ఆలీషా అనువాదము

క్రైస్తవ వాఙ్మయ సమాజము, మద్రాసు (C. L. S.)

1959 సైజు 20 × సెం. మీ. పు. 6 + 100 రు. 1 . 35

శుద్ధసత్వానందస్వామి (సంకలనకర్త)

క్రైస్తు సూక్తిమాల

నేలటూరి భక్తవత్సలము అనువాదకులు

శ్రీరామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు.

1961 సైజు 10 . 5 × 6 . 8 సెం. మీ. పు. 8 + 120 రు. 0 . 40

## 294 . 1 వేదములు

అచ్యుతుని వెంకటాచలపతిరావు

వేదభూమి

వెంకట్రామా అండ్ కో

1950 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 14 + 208 రు. 3 . 00

దయానంద సరస్వతి

యుజుర్వేద భాష్యము

అన్నె కేశవార్యశాస్త్రి అనువాదం

దయానంద సరస్వతి

ఆర్యగ్రంథాలయము, ముదునూరు

ప్రథమాధ్యాయం

1958 పు. 84 రు. 2 . 00

కల్లూరి చంద్రమౌళి
వేదామృతము
సందేశమాల, తెనాలి
1953 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 110 రు. 1 . 50

తిరుమల శ్రీనివాసశర్మ
వేదవాఙ్మయము
సంస్కృతి నికేతనం, హైదరాబాదు
1953 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 168 + 8 రు. 1 . 50

పీసపాటి లక్ష్మావధాని
చతుర్వేద పరమ రహస్యము
ప్రతులకు : రచయిత, అగ్రహారము, గుంటూరు
1950 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 16 + 523 రు. 10 . 00

బంకుపల్లె మల్లయ్యశాస్త్రి (అను.)
ఆంధ్రవేదములు: ఋగ్వేదము – ప్రథమసంపుటము
వినయాశ్రమం, కావూరు, గుంటూరుజిల్లా
1940 సైజు 24 . 4 × 15 . 5 సెం. మీ.
పు. 480 రు. 10 . 00
ఆంధ్రవేదములు: సామవేదము – ప్రథమసంపుటము.
వినయాశ్రమం, కావూరు, గుంటూరుజిల్లా
1941 సైజు 24 . 4 × 15 . 5 సెం. మీ.
పు. 4 + 16 + 442 రు. 10 . 00

రామవరపు కృష్ణమూర్తిశాస్త్రి (అను.)
ఆంధ్రవేదములు: కృష్ణయజుర్వేదము – ప్రథమసంపుటము
వినయాశ్రమం, కావూరు, గుంటూరుజిల్లా
1940 సైజు 24 . 4 × 15 . 5 సెం. మీ.
పు. 424 రు. 10 . 00

స్వామి దయానంద సరస్వతి
ఋగ్వేదాది భాష్యభూమికా
ఎల్లమరాజు నారాయణభట్టు అనువక్త
కొండూరు వెంకటసుబ్బయ్యగారు, 'ఆర్యకుటీరము', పరిగి, అనంతపురముజిల్లా.
1940 సైజు 21 × 13 . 5 సెం. మీ. పు. 24 + 623 రు. 2 . 00

## 294 . 1 వైదికమతము : ఉపనిషత్తులు

అనుభవానందస్వాములవారు
మాండూక్య రసాయనము
అనుభవానంద గ్రంథమాల, బాపట్ల
1959 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 172 రు. 1 . 25

అష్టోత్తర శతోపనిషత్తులు బ్రహ్మసూత్ర భగవద్గీతా, మహావాక్య రత్నావళి సహితం
వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు
1954 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 8 + 960 + 98 రు. 10 . 00

కనుపర్తి మార్కండేయశర్మ
ప్రశ్నోపనిషత్తు ఆంధ్ర టీకా తాత్పర్యవివరణలతో
వావిళ్ల ప్రచురణ
1932 సైజు 19×12 . 7 సెం. మీ.
పు. 156 రు. 1 . 50

మాండూక్యోపనిషత్తు ఆంధ్ర టీకా తాత్పర్య వివరణలతో
వావిళ్ల ప్రచురణ
1932 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 348 రు. 2 . 00

శ్వేతాశ్వతరోపనిషత్తు ఆంధ్ర టీకాతాత్పర్యాదుల సహితం
వావిళ్ల ప్రచురణ
1933 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 376 రు. 2 . 00

తైత్తిరీయోపనిషత్తు ఆంధ్ర టీకా తాత్పర్య సహితం
వావిళ్ల ప్రచురణ
1946 మూడవముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 640 రు. 5 . 00

కె. సచ్చిదానందమూర్తి
ఈశోపనిషత్తు (సవివరణమ్)
సుందరరాం అండ్ సన్స్, తెనాలి
1946 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 90 రు. 1 . 00

కోట హనుమంతరావు
ఇదంతా (ఉపనిషద్వ్యాహారము)
గ్రంథకర్త, హంసాఆర్ట్సు, 51 వాలాజారోడ్డు, మద్రాసు-2.
1959 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 46 + 448 రు. 6 . 00

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి (అను.)
ఈశావాస్యోపనిషత్తు
రాపర్తి కామయ్యపంతులు, అనకాపల్లి
1957 సైజు 21 × సెం. మీ.
పు. 40 + 198 రు. 2 . 50

శ్రీమదానందగిరి
బృహదారణ్యకోపనిషత్ టీకాయుక్త శంకరరామానుజ భాష్య సహితము
వావిళ్ల ప్రచురణ
1933 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 28 + 1004 రు. 8 . 00

రాజయోగి
ఉపనిషత్సారము
అద్దేపల్లి అండ్ కో
1948 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 6 + 222 రు. 2 . 00

వావిళ్ల రామస్వామిశాస్త్రిలు
 ద్వాదశోపనిషత్తులు
 వావిళ్ల ప్రచురణ
 1950 ద్వితీయముద్రణము. సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
 పు. 328 రు. 5 . 00

శ్రీసురేశ్వరాచార్యులవారు
 నైష్కర్మ్యసిద్ధి – ఆంధ్ర టీకా తాత్పర్యములు
 కొంపెల్ల దక్షిణామూర్తి
 వావిళ్ల ప్రచురణ
 1955 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
 పు. 504 + 8 + 12 రు. 5 . 00

సోమయాజుల వెంకట శివశాస్త్రి
 బృహదారణ్యకోపనిషత్
 దువ్వూరి రామకృష్ణారావు, వీరభద్రపురం, రాజమండ్రి
 1960 ద్వితీయ ముద్రణ సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
 పు. 764 రు. 10 . 00

## 294 . 1 స్మృతులు

పరాశరస్మృతి తాత్పర్యసహితము
 వావిళ్ల ప్రచురణ
 1954 సైజు 16 . 3 × 10 . 5 సెం. మీ.
 పు. 176 రు. 1 . 50

## 294 . 1 పురాణములు

ఎఱ్ఱాప్రెగ్గడ
 నృసింహపురాణము
 వేలూరి శివరామశాస్త్రి పరిష్కర్త
 వావిళ్ల ప్రచురణ
 1960 సైజు 19 × 12 . 7 సెం. మీ.
 పు. 32 + 245 రు. 2 . 50

కల్లూరి వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులు
మహాపురాణములు (కూర్మ, వరాహ పురాణములు)
వెంకట్రామా అండ్ కో., విజయవాడ
1952 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 172 రు. 4.00

చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి (అను.)
కార్తీక పురాణము
చల్లా సుబ్బరాయశాస్త్రి, మచిలీపట్నం
1957 సైజు 22.2 × 14.2 సెం. మీ. పు. 100 రు. 2.00

నోరి నరసింహశాస్త్రి
దేవీ భాగవతము 1, 2, 3 స్కంధములు
సాహితీసమితి, రేపల్లె
1950 సైజు 22.2 × 14.2 సెం. మీ. పు. 404 రు. 5.00

పాల్కురికి సోమనాథకవి
బసవపురాణము
మొదటిముద్రణ పీఠిక: కాశీనాథుని నాగేశ్వరరావు
రెండవముద్రణ పీఠిక: నిడదవోలు వెంకటరావు
ఆంధ్రగ్రంథమాల, మద్రాస్-1
1952 సైజు 17.1 × 10.7 సెం. మీ.
పు. 2 + 13 + 31 + 4 + 212 రు. 4.00

పిశుపాటి చిదంబరశాస్త్రి
శ్రీమదాంధ్ర పద్మపురాణము
ప్రథమ సంపుటము
1953 పు. 16 + 48 + 8 + 103 + 138 + 124 రు. 8.00
ద్వితీయ సంపుటము
1955 పు. 5 + 234 రు. 8.00
ప్రచురణ: విద్వాన్ పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రి
వెంకటగిరి మహారాజు కళాశాల, నెల్లూరు

తృతీయ సంపుటము
1956 పు. 16 + 270 రు. 8 . 00
చతుర్థ సంపుటము
1956 పు. 6 + 348 రు. 8 . 00
ప్రచురణ: పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి
చిదంబర గ్రంథమాల, రామారావుపేట, కాకినాడ

పూడిపెద్ది లింగమూర్తి
బసవపురాణము (వచనం)
కాళహస్తి ప్రచురణ
1957 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 298 రు. 4 . 00

శ్రీ భవిష్యపురాణము (వచనం)
వావిళ్ల ప్రచురణ
1938 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 12 + 1082 రు. 6 . 00

ముదిగొండ నాగవీరేశ్వరకవి
శ్రీ శివపురాణము
ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి, 43 మారేడుపల్లి,
సికింద్రాబాదు
పు. 732 రు. 8 . 00

రామావఝుల కొండయ్యశాస్త్రి
తెలుఁగు వామనపురాణము
వావిళ్ల ప్రచురణ
1929 సైజు 25 . 4 × 19 సెం. మీ.
పు. 26 + 120 రు. 5 . 00

వెన్నెలకంటి సూరన
ఆంధ్రశ్రీ విష్ణుపురాణము
వావిళ్ల ప్రచురణ
1955 పు. 16 + 389 రు. 5 . 00

వేమూరి జగన్నాథశర్మ

అష్టాదశ పురాణసారము – నాలుగుభాగములు

రామా & కో., ఏలూరు

1958, 1959 పునర్ముద్రణము. సైజు 19 × 12 . 7 సెం. మీ.

పు. 234 + 222 + 224 + 204 రు. 8 . 00

వోలేటి వేంకట లక్ష్మీనృసింహశర్మ

అష్టాదశపురాణములు

కాళహస్తి ప్రచురణ

1958 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 22 + 771 రు. 8 . 00

వోలేటి వెంకట లక్ష్మీనృసింహశాస్త్రి

మాఘపురాణము (వచనము)

కాళహస్తి ప్రచురణ

1960 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 160 రు 1 . 50

వైశాఖపురాణము (వచనము)

కాళహస్తి ప్రచురణ

1960 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 96 రు. 1 . 00

శ్రీనాథుడు

భీమేశ్వర పురాణం

చిలుకూరి పాపయ్యశాస్త్రి పీఠిక

అద్దేపల్లి అండ్ కో

1958 ప్రథమముద్రణ. సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.

పు. 4 + 120 + 268 రు. 6 . 00

## 294 . 1 భగవద్గీత

జ్ఞానేశ్వర మహారాజ్

జ్ఞానేశ్వరీ – భగవద్గీత

సత్యనారాయణ అనువాదము

టి. వెంకటరత్న, కీరపండరీక్షేత్రం, చిలకలపూడి పోస్టు

1956 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 16 + 831 రు. 8 . 00

తుపాకుల అనంతభూపాలుడు
భగవద్గీత (తెనుగు వచనము)
గీతాప్రచార పరిషత్తు, ఎలమంచిలి, విశాఖపట్నముజిల్లా
1939 సైజు 13 . 3 × 10 సెం. మీ. పు. 4 + 159

త్రిపురనేని రామస్వామిచౌదరి
భగవద్గీత
నవోదయ పబ్లిషర్సు, విజయవాడ-2
1959 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 73 + 89 రు. 3 . 00

బాలగంగాధరతిలక్
గీతారహస్యము అను కర్మయోగశాస్త్రము
నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి అనువాదం
కేసరి ఆఫీసు, పునహా
1918 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 68 + 1188 + 32 రు. 15 . 00

యల్లాపంతుల జగన్నాథం
గీతా స్వబోధిని
వెంకట్రామ అండ్ కో
1948 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 16 + 198 రు. 1 . 50

వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాద్
గీతామృతము
శాంతిసదనము, జగ్గయ్యపేట
1955 సైజు 17 . 1 × 10 . 7 సెం. మీ.
పు. 18 + 22 + 30 + 206 + 118

వినోబాభావే
గీతా ప్రవచనములు
డాక్టరు వెంపటి సూర్యనారాయణ అనువాదము
అనువాదకులు, తెనాలి
1956 అయిదవముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 286 + 12 రు. 1 . 25

విన్నకోట వెంకటరత్నశర్మ
గీత - బైబిల్ - కొరాన్
కాళహస్తి ప్రచురణ
1956 పంచమ సంస్కరణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 912 రు. 10 . 00

రామచంద్రానంద సరస్వతీ
భగవద్గీతా - ఆంధ్ర టీకా తాత్పర్యభాష్యత్రయ వివరణ సహితము
వావిళ్ల ప్రచురణ
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 32 + 674 రు. 6 . 00

సర్వేపల్లి రాధాకృష్ణన్
భగవద్గీత
బులుసు వెంకటేశ్వర్లు అనువాదం
బి. వి. & సన్స్, కాకినాడ
1958 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 436 + 42 రు. 5 . 00

## 294 . 3 బౌద్ధమతము

దుగ్గిరాల బలరామకృష్ణయ్య
బుద్ధపురాణము
మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా
1927 సైజు 18 . 5 × 12 . 5 సెం. మీ.
పు. 8 + 40 + 10 + 128 + 1086 రు. 4 . 00

శ్రీరాజావాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద బహద్దరు (అను.)
ధమ్మపదము
ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి
1926 సైజు 19 × 12 . 8 సెం. మీ.
పు. 8 + 46 + 183 + 35 రు. 1 . 25

సర్వేపల్లి రాధాకృష్ణన్
గౌతమ బుద్ధుడు
అంబడిపూడి హనుమయ్య అనువాదము
సెంట్రల్ రైల్వే మజ్దూర్ సంఘము, కాజీపేట
1958 సైజు 18 × సెం. మీ.
పుటలు 4 + 34 రు. 0 . 40

294 . 5 హిందూమతము

కేశవతీర్థస్వామి
జగద్గురు శ్రీ రామతీర్థ జీవితోపదేశములు
శ్రీ రామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల, గుంటూరుజిల్లా
సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 500 రు. 5 . 00

గంగాప్రసాద్ ఉపాధ్యాయ
ఆస్తిక వాదము
గోపదేవ్ అనువాదము
ది మాడరన్ పబ్లిషర్సు, తెనాలి.
1947 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 18 + 332 రు. 4 . 00

గోపరాజు రామచంద్రరావు (గో రా)
దేవుని పుట్టుపూర్వోత్తరాలు
కాగడా ప్రచురణలు, కర్నూలు
1956 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 36 రు. 0 . 62
నాస్తికత్వం
ప్రతులకు : నాస్తిక కేంద్రం, పటమట, విజయవాడ-6
1950 సైజు 19 + 12 . 7 సెం. మీ. రు. 1 . 50

చిరంతనానందస్వామి (అను.)
శ్రీ రామకృష్ణ బోధామృతము
శ్రీ రామకృష్ణమఠము, మద్రాసు-4
1954 పంచమముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.
(5) పు. 14 + 496 రు. 3 . 50

జటావల్లభుల పురుషోత్తము

హిందూమతము

పురుషోత్తమగ్రంథమాల, సత్యనారాయణపురము, విజయవాడ

1947 సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 184 రు. 1.00

పి. యస్. ఆచార్య

దేవుడు లేడా?

అన్నె వెంకట్రామయ్య, తోట్లవల్లూరు, కృష్ణాజిల్లా

1951 సైజు 17.2 × 12.3 సెం. మీ.

పు. 16 + 330 + 3 రు. 2.00

బళ్ళ వెంకన్నకవి

పరబ్రహ్మానంద పరిపూర్ణ బోధామృతము - 2 సంపుటములు

బళ్ళ వెంకన్న అండ్ సన్సు, కాకినాడ

1946, 1950 సైజు 19 × 12.7 సెం. మీ.

పుటలు 36 + 500; 525 + 120 సంపుటము 1 కి రు. 5.00

వివేకానందస్వామి

సందేశతరంగిణి - 2 భాగములు

కొలంబో - ఆల్మోరా ఉపన్యాసములు

తత్త్వానందస్వామి అనువాదం

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-4

1955 సైజు 19 × 12.7 సెం. మీ.

పు. 8 + 330; 324 ఒక్కొక్క భాగము రు. 3.00

స్వామి దయానంద సరస్వతి

సత్యార్థ ప్రకాశము

ధూ. రాజరత్నాచార్యులు ఆంధ్రానువాద సంశోధకులు

దక్షిణభారత హైదరాబాద ఆర్యసమాజ్

1932 రెండవకూర్పు. సైజు 23.5 × 15.5 సెం. మీ.

పు. 20 + 86 + 3 రు. 2.00

## 294 . 5 స్థల పురాణములు

కొండపల్లి రామచంద్రరావు

శ్రీ భద్రాచలక్షేత్ర చరిత్ర

విశ్వసాహిత్యమాల, రాజమహేంద్రవరం

1957 సైజు 19 × 12 . 7 సెం. మీ.

పు. 8 + 110 + 20 రు. 1 . 50

కొడాలి లక్ష్మీనారాయణ

చారిత్రక కాశీక్షేత్రము

ఇతిహాస పరిశోధకమాల, మోపర్రు, తెనాలితాలూకా

1953 సైజు 19 × 12 . 7 సెం. మీ.

పుటలు 8 + 72 రు. 1 . 00

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి

శ్రీకాశీక్షేత్రమాహాత్మ్యము

కొండపల్లి ప్రచురణ

1954 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 92 రు. 1 . 00

నందనవనం సుబ్బారావు

శ్రీ అమరేశ్వర క్షేత్రమహిమ

శ్రీ అమరేశ్వరస్వామివారి దేవస్థానం, అమరావతి, గుంటూరుజిల్లా

1956 తృతీయముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.

పు. 12 + 98 రు. 1 . 00

బులుసు వెంకటరమణయ్య

శ్రీశైలక్షేత్రము

బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు

సైజు 18 × సెం. మీ.

పుటలు 12 + 84 రు. 1 . 00

శ్రీరంగమహాత్మ్యము

ఎస్. పి. స్వామి & సన్సు, మద్రాసు

1957 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ. పు. 48 రు. 0 . 75

## 297 ఇస్లాం మతము

చిలుకూరి నారాయణరావు

కురాను షరీఫ్
ఆత్రేయాశ్రమము, అనంతపురము.
1938 సైజు 22 . 2 × 14 . 2 సెం. మీ.
పు. 25 + 754 రు. 6 . 00

మహమ్మద్ వాలియుద్దీన్

మిష్కాత్ – ఇ – షరీఫ్, 2వ భాగము
మహమ్మద్ గఫూర్ వ్యాఖ్యాన సహిత అనువాదము
వ్యాఖ్యాత, కంభము, కర్నూలుజిల్లా
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పుటలు 692 రు. 4 . 00

మౌల్వి ముష్షిఫాజిల్

ఖురాన షరీఫ్ – 2 సంపుటములు
మహమ్మద్ అబ్దుల్‌గఫూర్, వైస్ ప్రిన్సిపాల్, ఇస్లామియా అరబ్ కాలేజి, కర్నూలు
మొదటి సంపుటం 1-15 కాండలు
1948 సైజు 24 . 4 × 15 . 5 సెం. మీ.
రెండవ సంపుటం 16-30 కాండలు
పు. 936, 916

# 300 సమాజ శాస్త్రము

ఆకురాతి చలమయ్య

మహా మానవ మహాత్మా గాంధీజీ జీవనవేదము
శాంతినిలయము, కాకినాడ
1950 ద్వితీయముద్రణ. సైజు 19 × 12 . 7 సెం. మీ.
పుటలు 26 + 666 రు. 8 . 00

కొత్త సత్యనారాయణచౌదరి

కామశాస్త్రము

భాషాపోషక మండలి, అమృతలూరు, తెనాలి తాలూకా

1932 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 148 రు. 2 . 00

గాంధీజీ

సర్వోదయము

భరతన్ కుమారప్పసంకలనము, మానికొండ సత్యనారాయణ శాస్త్రి అనువాదము

గాంధీసాహిత్య ప్రచురణాలయము, (గాంధిస్మారకనిధి, ఆంధ్రశాఖ) రామారావుపేట, కాకినాడ

1960 సైజు 18 . 2 × 12 . 4 సెం. మీ.

పుటలు 22 + 399 రు. 4 . 00

గాంధీజీ, రాజేంద్రబాబు

నిర్మాణ కార్యక్రమము అంటే - ఎందుకు ?

మోటూరి సత్యనారాయణ, వూటుకూరి నరసింహారావు అనువాదకులు

జాతీయజ్ఞాన మందిరము, మదరాసు-14

1949 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 87 రు. 1 . 00

జయప్రకాశ్‌నారాయణ్

సర్వోదయానికి నా ప్రయాణం

బి. నాగేశ్వరరావు అనువాదం

సర్వోదయ సాహిత్య ప్రచారసమితి, గాంధిభవన్, హైదరాబాదు

1958 సైజు 19 × 12 . 7 సెం. మీ. పు. 68 రు. 0 . 37

జి. రాధాకృష్ణమూర్తి

సంఘజీవనము

ఆదర్శ ప్రచురణ

1959 సైజు 19 × 12 . 7 సెం. మీ. పుటలు 45 రు. 0 . 80

జె. జి. డి. బి. యుస్

ఈ నాగరికత !

యన్. అర్. చందూర్ అనువాదం

ప్రతిమాబుక్స్, 49 మూకతాల్ వీధి, మద్రాస్-7

1955 సైజు 19 × 12 . 7 సెం. మీ. పుటలు 174 రు. 1 . 25

తత్త్వానందస్వామి

పౌరధర్మ ప్రకాశిక

ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని, తెనాలి

సైజు 19 × 12 . 7 సెం. మీ.

పు. 276 రు. 2 . 50

బాబు భగవాన్‌దాసు

సంఘ నిర్మాణశాస్త్రము (మనుధర్మశాస్త్రము ననుసరించి)

గుంటూరు వేంకటసుబ్బారావుగారిచే సంగ్రహముగా తెలుగులో వ్రాయబడినది.

అయ్యంకి వేంకటరమణయ్య, బెజవాడ

సైజు 11 . 5 × 10 . 3 సెం. మీ.

పు. 34 + 172 రు. 0 . 25

మహాత్మాగాంధి

మన గ్రామ పునర్నిర్మాణం

భరతన్ కుమారప్పసంకలనం, కొడాలి ఆంజనేయులు అనువాదం

గాంధీసాహిత్య ప్రచురణాలయం, కాకినాడ

1960 సైజు 17 . 6 × 12 . 3 సెం. మీ.

పుటలు 12 + 188 రు. 2 . 00

హైందవ స్వరాజ్యము

ఆంగ్లమునుండి అనువాదితము

శ్రీ వాసంత గ్రంథనిలయము, 17 నారాయణ మొదలివీధి, మద్రాసు

1919 సైజు 17 . 5 × 11 . 8 సెం. మీ. పుటలు 4 + 142

మాదల వీరభద్రరావు

గుంటూరుజిల్లా సాంఘికవిజ్ఞానం
సాహిత్యలతా గ్రంథమాల, గుంటూరు
1955 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పుటలు 8 + 100 రు. 1 . 00

మామిడిపూడి వెంకటరంగయ్య

మన జాతీయ పునర్నిర్మాణము : విద్యార్థుల కర్తవ్యము
తెలుగువిద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం
1960 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 48 రు. 0 . 60

యమ్. యన్. రాయ్

పిల్లికథ
ఏ. వి. మోహన్ అనువాదము
సాహితీకేంద్రం, తెనాలి
1955 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 8 + 108 + 2 రు. 1 . 00

మధ్యతరగతి
ఆవుల గోపాలకృష్ణమూర్తి అనువాదము
రినైజాన్సు పబ్లిషర్సు, తెనాలి
1945 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 50 రు. 0 . 50

హెన్రీ డేవిడ్ థోరే

నవనాగరికతకు దూరంగా...
"ముకయా" అనువాదము
దేశీ ప్రచురణ
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 198 రు. 3 . 00

## 310 సంఖ్యా వివరములు

కప్పగంతుల సత్యనారాయణ
ప్రపంచ దర్శిని 1961–62
కథామాల ప్రచురణలు, మద్రాస్
1961 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. రు. 4.00

గొట్టిపాటి కొండపనాయుడు
మనం : మనదేశం
విజయరాం అండ్ కో, కావలి, నెల్లూరుజిల్లా
1956 సైజు 19 × 12.7 సెం. మీ.
పు. 579 రు. 5.00

యస్. వి. నరసయ్య, కె. యస్. రెడ్డి
ఆంధ్రప్రజలు – సిరిసంపదలు
విశాలాంధ్ర ప్రచురణ
1953 సైజు 25.5 × 18.5 సెం. మీ.
పు. 206 రు. 2.75

యస్. వి. నరసయ్య వగైరా (సంపా.)
ఆంధ్రదర్శిని 1959
విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ
సైజు 25.4 × 19 సెం. మీ.
పు. 862 రు. 10.00

## 320 రాజకీయ శాస్త్రము

అయ్యదేవర కాళేశ్వరరావు
తురుష్క ప్రజాస్వామికము (మధ్యప్రాచ్య దేశములు)
ఆదర్శ ప్రచురణ
1959 సైజు 19 × 12.7 సెం. మీ
పు. 279 రు. 3.00

ఆచార్య రంగా

పంచాయతీ భూస్వామ్యం - రైతుస్వామ్యం
జాస్తి జగన్నాథం అనువాదం
టాగూర్ ప్రచురణలు, తెనాలి
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 64 రు. 0 . 63

ఆవుల గోపాలకృష్ణమూర్తి

జాతీయ ప్రభుత్వం
రినైజాన్సు పబ్లిషర్సు, తెనాలి.
1950 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 60 రు. 0 . 50

ఎమిలీ బరన్స్

మార్క్సిజం అంటే ఏమిటి?
మద్దుకూరి చంద్రశేఖరరావు అనువాదం
విశాలాంధ్ర ప్రచురణ
1953 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 142 రు. 1 . 00

ఎలంకుళత్తు మనక్కాల్ శంకరన్ నంబూద్రిపాద్

మహాత్ముడు ఆయన సిద్ధాంతాలు
కంభంపాటి సత్యనారాయణ, మహీధర రామమోహనరావు అనువాదం
విశాలాంధ్ర ప్రచురణ
1958 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 134 రు. 1 . 50

కొడాలి లక్ష్మీనారాయణ

ప్రాచీన భారతీయ ప్రజాస్వామికములు
ఇతిహాస పరిశోధకమాల, మోపర్రు, తెనాలితాలూకా
1955 సైజు 19 × 12 . 7 సెం. మీ.
పు. 38 రు. 0 . 50

